## సాహిత్యం వివరాలు

| | | |
|---|---|---|
| 1. | 2011 లోగా భూమిపై వెలయునున్న స్వర్ణయుగము | 400.00 |
| 2. | సీక్రెట్ డాక్ట్రిన్ ఉపన్యాసాలు | 375.00 |
| 3. | సావిత్రి ఉపన్యాసాలు | 210.00 |
| 4. | ఐశ్వర్యము యొక్క మానసికస్థితి | 160.00 |
| 5. | యూనివర్సల్ మైండ్ | 130.00 |
| 6. | అమృతత్వ విద్య | 120.00 |
| 7. | భగవద్గీత ఉపన్యాసాలు 5 భాగాలు | 670.00 |
| 8. | ఆణిముత్యాలు (పై 5 భాగాల ముఖ్యాంశాలు) | 130.00 |
| 9. | ఆత్మకథ | 200.00 |
| 10. | మాస్టర్ ఆర్.కె. లెటర్స్ | 150.00 |
| 11. | ఆహార విజ్ఞానము | 60.00 |
| 12. | సూర్యకిరణ విజ్ఞానము | 50.00 |
| 13. | వేదమయ జీవనం | 40.00 |
| 14. | విశిష్ట యోగసాధనలు | 40.00 |
| 15. | భూమిపై సశరీరముగా ఉన్న కల్కి అవతారము | 40.00 |
| 16. | రహస్య జ్యోతిర్విద్య | 40.00 |
| 17. | ప్రాక్టికల్ థియాసఫీ | 30.00 |
| 18. | ఆహారాన్ని అమృతంగా మార్చండి | 20.00 |
| 19. | ధ్యానానికి మొదటి మెట్లు యమ నియమాలు | 20.00 |
| 20. | శ్వాస ధ్యానము | 16.00 |

**ప్రతులకు :**

✧ పి. సీతారాముడు, 18-9-105, మానేపల్లి వారి వీధి, భీమవరం - 534 201, ప.గో. జిల్లా. ఫోన్ నెం.: 08816 - 234615.

# శ్రీసూక్తము



డా॥ ఎమ్. శ్రీరామకృష్ణ M.Sc., Ph.D.

శ్రీసూక్తము

ఎడిటర్ : గురు సీతారామ్

శ్రీ విరోధి నామ సంవత్సరం,
శ్రావణ శుక్ల షష్ఠి, సోమవారం,
27.7.09.

వెల : రూ. 20.00

ప్రతులకు :
పి. సీతారాముడు,
18-9-105,
మానేపల్లి వారి వీధి,
భీమవరం - 534 201, ప.గో. జిల్లా.
ఫోన్ నెం. : 08816 - 234615

డి.టి.పి. :
ఇంద్రా, భీమవరం

పబ్లిషర్స్ :
విశ్వకర్మ పబ్లికేషన్స్, భీమవరం

ప్రింటర్స్ :
సాయి ఆఫ్‌సెట్ ప్రింటర్స్, భీమవరం



# శ్రీసూక్తము

శ్రీసూక్తముపై డా॥ ఎమ్. శ్రీరామకృష్ణగారు 2001 ఆగస్టు మొదటివారంలో సప్త ఋషి ఆశ్రమములో ఇచ్చిన వివరణ

ఈ క్రింది పరిజనుల సౌజన్యముతో
ఈ పుస్తకము పునర్ముద్రించబడినది.

| | |
|---|---|
| శ్రీమతి బి. అనూరాధ | రేపల్లె |
| శ్రీమతి కె. సౌజన్య | విశాఖపట్నం |
| శ్రీమతి డి. మాణిక్యమ్మ | హైదరాబాద్ |
| శ్రీమతి ఎమ్. నాగలిపి | విజయవాడ |
| శ్రీమతి ఎల్. రాజ్యలక్ష్మి | ఒంగోలు |
| శ్రీమతి ఏ. శారద | గుంటూరు |
| శ్రీమతి ఏ. విజ్ఞానవతి | భీమవరం |
| శ్రీమతి ఏ.వి. మీనాభాయి | విశాఖపట్నం |
| శ్రీ జి. చెన్నకేశవరావు | ఉండవల్లి సెంటరు |
| శ్రీ వి. సుబ్బారావు | వాడరేవు |
| శ్రీమతి ఎల్. రాజమ్మ | పేరాల |
| శ్రీమతి వి. రామ తులసమ్మ | చీరాల |

పై పరిజనులందరికి హృదయపూర్వక కృతజ్ఞతలు

గురు సీతారామ్

# శ్రీసూక్తము



హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణ రజతస్రజామ్ ।
చన్ద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ ॥ 1

తామ్మ ఆవహ జాతవేదో లక్ష్మీ మనపగామినీమ్ ।
యస్యాం హిరణ్యం విన్దేయం గామశ్వమ్ పురుషానహమ్ ॥ 2

అశ్వపూర్వాం రథమధ్యాం హస్తినాద ప్రబోధినీమ్ ।
శ్రియన్దేవీ ముపహ్వయే శ్రీర్మా దేవీ ర్జుషతామ్ ॥ 3

కాంసోస్మితాం హిరణ్యప్రాకారామ్ ఆర్ద్రామ్ జ్వలన్తీం తృప్తామ్ తర్పయన్తీమ్ ।
పద్మేస్థితాం పద్మవర్ణాం తామిహోపహ్వయే శ్రియమ్ ॥ 4

చన్ద్రాం ప్రభాసాం యశసా జ్వలన్తీం శ్రియం లోకే దేవ జుష్టా ముదారామ్ ।
తామ్ పద్మినీం ఈం శరణ మహం ప్రపద్యే అలక్ష్మీ ర్మే నశ్యతాం త్వాం వృణే ॥ 5

ఆదిత్యవర్ణే తపసోఽధిజాతో వనస్పతి స్తవ వృక్షోఽథబిల్వః ।
తస్యఫలాని తపసానుదన్తు మాయాన్తరాయాశ్చ బాహ్యా అలక్ష్మీః ॥ 6

ఉపైతు మాం దేవసఖః కీర్తిశ్చ మణినా సహ ।
ప్రాదుర్భూతోస్మి రాష్ట్రేస్మిన్ కీర్తిమృద్ధిం దదాతు మే ॥ 7



క్షుత్పిపాసా మలాం జ్యేష్ఠా మలక్ష్మీర్నాశయామ్యహమ్ ।
అభూతి మసమృద్ధిఞ్చ సర్వాన్నిర్ణుదమే గృహాత్ ॥ 8

గన్ధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్ ।
ఈశ్వరీగం సర్వ భూతానాం తామిహోపహ్వయే శ్రియమ్ ॥ 9

మనసః కామమాకూతిం వాచః సత్యమశీమహి ।
పశూనాగం రూపమన్నస్య మయి శ్రీశ్శ్రయతాం యశః ॥ 10

కర్దమేన ప్రజాభూతా మయి సమ్భవ కర్దమ ।
శ్రియం వాసయ మే కులే మాతరమ్ పద్మ మాలినీమ్ ॥ 11

ఆప స్సృజన్తు స్నిగ్ధాని చిక్లీత వస మే గృహే ।
నిచ దేవీం మాతరగం శ్రియం వాసయ మే కులే ॥ 12

ఆర్ద్రాం పుష్కరిణీం పుష్టిమ్ పింగళాం పద్మ మాలినీమ్ ।
చన్ద్రాం హిరణ్మయీం లక్ష్మీమ్ జాతవేదో మమావహ ॥ 13

ఆర్ద్రాం యః కరిణీం యష్టిం సువర్ణాం హేమమాలినీమ్ ।
సూర్యాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ ॥ 14

తాం మ ఆవహ జాతవేదో లక్ష్మీ మనపగామినీమ్ ।
యస్యాం హిరణ్యం ప్రభూతమ్ గావోదాస్యోఽశ్వాన్ విన్దేయం పురుషానహమ్ ॥15

## ఫలశ్రుతి

యశ్శుచిః ప్రయతో భూత్వా జుహుయా దాజ్య మన్వహమ్ ।
శ్రియః పంచదశర్చం చ శ్రీ కామః సతతం జపేత్ ॥

శుచిమంతుడై, ప్రయత్నము గలవాడై అనుదినము శ్రీసూక్తము యొక్క పదునైదు ఋక్కులను శ్రీకాముడైన వాడు నేతితో హోమము చేయుచు జపించవలెను.



హిరణ్యవర్ణాం హరిణీం
సువర్ణ రజతస్రజామ్ ।
చన్ద్రాం హిరణ్మయీం లక్ష్మీం
జాతవేదో మమావహ ॥

హిరణ్యవర్ణాం = కిరణమయములగు వర్ణము గలది. హరిణీం = ఆడులేడి వలె చపలమైన గమనము గలది. ఇది కిరణ లక్షణము. శబ్ద తరంగ లక్షణము. హరి, హర శబ్దములను కొని వచ్చునది. సువర్ణరజత స్రజామ్ = మంచి వర్ణములను పుట్టించు వెండి వంటి స్వచ్ఛమైన కిరణము. చంద్రాం = ఆహ్లాదకర మైనది. హిరణ్మయీం = కిరణముల రూపము గలది. లక్ష్మీం = లక్ష్మీ లేక చిహ్నము గలది. జాతవేదః = తనయందు వేదము పుట్టినవాడు. మమ అవహ = నాకు సాధించి పెట్టునుగాక అని అర్థము.

జాతవేదుడు అగు అగ్నిహోత్రుడు హిరణ్య వర్ణమును, హరిద్రా వర్ణమును గలిగినదియు, వెండి, బంగారు రంగు హారములు ధరించినది యు, ఆహ్లాద స్వరూపిణియు, హిరణ్య సంపదతో చేయబడిన మూర్తి గలది యునగు లక్ష్మిని నాకు కలుగచేయును గాక!



జాతవేదుడు - వేదములందు పుట్టినవాడు,
వేదాలను పుట్టించువాడు.

❋ ఇది వ్యక్తిలో నేను అనే చేతనత్వము.
ఆ చేతనత్వము యొక్క వేడి పెరిగి పెరిగి జ్వాలగా మారి,
అక్కడ నుండి వెలుతురుగా మారాలి.

విద్యుద్దీపము దానికి ఉదాహరణ. చాలా లో వోల్టేజీ ఉన్నప్పుడు కనిపించీ కనిపించకుండా ఉండే ఎరుపు (ఆర్ద్రా, ఆరుద్రా నక్షత్రం) వోల్టేజి పెరుగుతున్న కొద్ది వేడి పెరిగి ఆ ఎరుపురంగు పెరుగుతుంది. ఇంకా వేడి చేసినప్పుడు దానిలోకి వెలుతురు (వేడితోపాటు) రావడం మొదలవుతుంది.

❋ భరించగలిగే వేడితో పాటు అంధకారాన్ని పోగొట్టేటటువంటి ఈ ప్రజ్ఞయే గురు చేతనత్వముగా, సర్వాంతర్యామిగా ప్రతీ చోట ఉండే 'నేను' అనే 'ప్రజ్ఞ'. దానినే ''అగ్ని'' అని వేదాలలో చెప్పారు.

అగ్ని యొక్క లక్షణాలు ప్రజ్ఞకు కూడా ఉంటాయి.

<u>అగ్ని యొక్క లక్షణాలు</u> - నిరంతరం ఊర్ధ్వముఖంగా ఉండుట,
వెలుగు, వేడి, ఉత్సాహము,
తన సంపర్కములోనికి వచ్చిన వానిని తన వలె మార్చుట.
-- ప్రజ్ఞ యొక్క లక్షణాలు కూడా ఇవే.

లక్ష్మీం - ఈ ప్రజ్ఞ జాతవేదుడు కనుక తన 'ప్రజ్ఞ' యొక్క లక్షణాలను తెలుసు కొని, అలాంటి లక్షణములనే చూపిస్తాడు.

❋ ఖనిజ, వృక్ష, జంతు జగత్తులలో ఈ జాతవేద లక్షణాల అభివ్యక్తీ కరణ పరిపూర్ణత చెందినది.

ఉదాహరణకి ఇనుము దాని యొక్క లక్షణాలనే అది అభివ్యక్తీకరి స్తుంది. తులసి తన లక్షణాలనే అభివ్యక్తీకరణ చేస్తుంది. ప్రతీది తన

లక్షణాలను ఎక్కడ ఉన్నా కోల్పోదు. ఉదాహరణకి ఇనుము మానవ శరీర ములో ఉన్నా, బాహ్యజగత్తులో ఉన్నా, అంటే చేతనత్వము గల భాగములో ఉన్నా, అచేతన భాగములో ఉన్నా, తన లక్షణాలను కోల్పోదు.

శ్రీ మనిషి యొక్క జాతవేద స్థితిని తెలుసుకోవాలి.
అది ఇంకా పరిణామక్రమములోనే ఉంది.
పరిపూర్ణ స్థితికి ఇంకా చేరుకోలేదు.

రాగి యొక్క లక్షణాలు కలిగిన కణాలన్నీ ఒకచోట చేరి ఉన్నప్పుడే అవి రాగి యొక్క ఖనిజముగా మారి ఒక చోటులో ఉండటం వల్ల దానిని పరిశుద్ధము చేసి ఉపయోగించుకోగలుగుతాము.

❋ అదే విధంగా పరిపూర్ణ మానవులందరూ సహజంగా ఒక చోట చేరారు. అది ప్రకృతి నియమము (శ్వేతద్వీపవాసులు).

❋ ఆ విధంగానే మానవజాతిలో పరిపూర్ణత చెందటానికి తయారుగా వున్న మానవులు అందరు అనేక ఆశ్రమాలలోనికి (అనేక విశ్వ విద్యాలయాలలో ఒకే డిగ్రీ పొందినట్లు) పరిపూర్ణత చెందటానికి ఆకర్షింపబడతారు.

అక్కడ (ఆశ్రమంలో) పరిపూర్ణ మానవుని లక్షణాలను తెలుసుకొని (లక్ష్మీం), ఆ లక్షణాలను మళ్ళీ అవసరమైన చోట ఉపయోగించుకోగలగాలి.

ఇనుము ఉంటే సరిపోదుకదా, దానిని ఏ రూపంలో ఉపయోగించుకోవాలి అన్నది తెలియాలి. దీనిని స్వయంప్రజ్ఞ లేక ఆత్మజ్ఞానము అంటారు (self realization). Man know thyself.

హిరణ్యవర్ణాం - ఆల్‌కెమీ, పరసువేది. దేనిని తాకితే ఒక పదార్థం వేరొక పదార్థంగా మారుతుందో, ఆ స్థితి.
తన వెనుకటి జాతవేద స్థితిని, లక్ష్మీ స్థితిని పరిపూర్ణముగా మార్చి వేసుకొని, వేరొక జాతవేద స్థితికి, లక్ష్మీ స్థితికి పరిణతి చెందగలుగుట.



ప్రకృతిలో ఈ లక్షణాలు అగ్నికి, బంగారానికి చెందుతాయి.

అగ్ని భౌతిక స్వరూపాన్ని మారిస్తే, బంగారం (విలువను తెలిపే జ్ఞానము) ప్రతీ పదార్థం యొక్క విలువ తెలుపుతుంది. అందువల్లే ఆ చేతనత్వములో ఉండే వ్యక్తి మట్టిని ముట్టుకొన్నా బంగారం అవుతుంది.

❋ "వర్ణము" అంటే అక్షరము, నాశరహితమైన స్పందనలు. ఈ నాశ రహిత ఏకసూత్రత తెలిస్తే కాయకల్ప విద్య హస్తగతమౌతుంది.

ఇక్కడ బంగారము అనేది ఒక పదార్థం కాదు, బంగారము అనే స్థితి యొక్క చేతనత్వ స్పందన. ఈ స్పందనల స్థాయి (rate of vibrations) నిరంతరమూ ఉంచుకోగలిగే గురువుల దగ్గరకి వచ్చి కిరీటములు ధరించినవారు కూడా పాదాల మీద వాలటం గమనిస్తున్నాము కదా!

పదార్థ వినిమయం (exchange) కొరకు ప్రకృతిలో కూడా అన్ని దేశాలు స్టాండర్డ్‌గా బంగారాన్నే ఉపయోగిస్తున్నాయి కదా!

జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాంచనః (భ.గీ. 6-8)

శాస్త్రజ్ఞాన, అనుభవజ్ఞానములచే తృప్తినొందిన మనస్సు గలవాడును, నిర్వికారుడును, ఇంద్రియములను లెస్సగా జయించిన వాడును, మట్టిగడ్డ, రాయి, బంగారము అను మూడింటిని సమముగా చూచువాడునగు యోగి యోగారూఢుడని చెప్పబడును.

❋ కానీ, బంగారము అనే భౌతిక పదార్థం కాకుండా హిరణ్య వర్ణమును తెలుసుకొన్నవాడు 'సమలోష్టాశ్మ కాంచన', ప్రతీ దానినీ బంగారంగా మార్చగలడు.

-- అంతే తప్ప బంగారాన్ని మట్టిగా చూడడు,
మట్టిని బంగారంగా మారుస్తాడు.

-- మట్టినే బంగారంగా మార్చుకోగలిగే వాడు విరాగి కాడు.

**ఎందువలన అంటే,**

వాడి చుట్టూరా ఉన్నది బంగారమే, 'హిరణ్య వర్ణమే', బంగారు స్పందనలె! అందువల్ల గురువుని అడుక్కోమన్నా అడుక్కోలేడు.

నీవు కోటీశ్వరుడవైనా, రాజ్యాధినేతవైనా "హిరణ్య వర్ణము" లేదు కనుక ఎంత హిరణ్యము ఉన్నా (హిరణ్యాక్షుడు, హిరణ్యకశిపుడు) గురువు ముందు సమర్పణ చేసుకోవలసినదే!

హరిణీం - చంచలమైనది. హరి హర శబ్దమును ఉత్పత్తి చేసేది.
అనగా సృష్టించటము, లయం చేయుట తెలియటము.

✧ 'జాతవేద', 'లక్ష్మీం' స్థితిని ఉపయోగించి పదార్థమును 'హిరణ్య' వర్ణ స్థితికి తీసుకొని వచ్చి (basic or fundamental vibration సర్వవ్యాపక స్థితి, వాసుదేవ స్థితి) అనగా లయ స్థితికి తీసుకొచ్చి,

-- అక్కడి నుండి మళ్ళా వేరొక జాతవేద లక్ష్మీ స్థితి (ఇక్కడ ముందు జాతవేద తరువాత లక్ష్మీ స్థితి అని వాడాము, అది గమనించుకోండి!)

-- 'హరిణీం' చపలమైన దృష్టి ద్వారా లేక శ్వాస ద్వారా 'మమ ఆవహ' నాలో ఆ స్థితి ఆవహింపబడు గాక!

సువర్ణ రజతస్రజామ్ - తద్వారా సూర్యాత్మకమైనటువంటి హిరణ్మయరసము,
కుడి శ్వాస, కుడి కన్ను,

-- మరియు చంద్రాత్మకమైనటువంటి ఎడమ శ్వాస,

-- తృతీయ నేత్రము నుండి ఆ సువర్ణ రజత వాహినిని ఆజ్ఞా చక్రము ద్వారా (అగ్ని, జాతవేద) బహిర్గతము చేయగలిగితే ... సువర్ణ రజతస్రజాం అవుతుంది.

గురువు యొక్క కృపా దృష్టి ఈ హిరణ్య రజతస్రజాంయే!



తాం మ ఆవహ జాతవేదో
లక్ష్మీ మనపగామినీమ్ ।
యస్యాం హిరణ్యం విన్దేయం
గామశ్వమ్ పురుషానహమ్ ॥

జాతవేదః = ఓ జాతవేదుడా! అనపగామినీం = విడిచిపోని యామెను, తాం లక్ష్మీం = ఆ లక్ష్మిని, మే = నాకు, ఆవహ = ఆవహింపజేయుము, యస్యాం = ఎవని వలన, హిరణ్యం = కిరణముల వెలుగుల సిరులను, గాం = గోవును, అశ్వం = గుఱ్ఱమును, పురుషాన్ = స్త్రీ పురుషులను (పరివారమును), అహమ్ = నేను, విందేయమ్ = పొందగలను.

వేదమునందు పుట్టిన వెలుగైన అగ్నీ! ఎన్నడును నన్ను విడిచిపోని లక్ష్మిని నాకు ఆవహింపచేయుము. దానివలన కిరణముల బంగారము, గోవులు, అశ్వములు, పురుషులు (పరివారమును) అను సంపదను నేను పొందగలను.

తొమ్మ ఆవహ జాతవేదో లక్ష్మీ మనపగామినీమ్ - పైన చెప్పిన వివరణ.

అనపగామినీమ్ - విడిచిపోని, అనగా మనము పూర్తిగా సంస్కరించబడి జాతవేద మరియు లక్ష్మీస్థితికి తగినట్లు నిరంతరము ఉండాలి.

గాం - అనగా గోవులు. వాక్‌శక్తి మరియు

అశ్వమ్ - ప్రాణశక్తి లేక అగ్ని యొక్క వేడి, ఉత్సాహం.

పురుషానహమ్ - అటువంటి వ్యక్తులతో (లైక్ మైండెడ్ వారితో) కలిసి ఉంటాను. తద్వారా ఆ చేతనత్వ స్థాయి పొందగలుగుతాను.

దానినే ఇక్కడ హిరణ్యం అన్నాడు.

హిరణ్యం అంటే వైబ్రేటింగ్ రేట్.







అశ్వపూర్వాం రథమధ్యాం
హస్తినాద ప్రబోధినీమ్ ।
శ్రియన్దేవీ ముపహ్వయే
శ్రీర్మా దేవీ ర్జుషతామ్ ॥

అశ్వపూర్వాం = అశ్వములు తొలుతగా గలది, రథమధ్యాం = రథములు నడుమగా గలది, హస్తినాద = ఏనుగుల నాదముచే, ప్రబోధినీం = మేల్కొలుప బడినది, శ్రియం = ఆశ్రయించునది, దేవీం = వెలుగుల రూపుగలది, ఉపహ్వయే = ఉపాసన చేయుదును, రమ్మని పలుకుదును. శ్రీం దేవీః = ఆశ్రయించునది, వెలుగులు గలదియు అగు నామె, మా = నన్ను, జుషతామ్ = అభిలషించును గాక !

తొలుత అశ్వములు, నడుమన రథములు, కొనకు ఏనుగులు నిలబడి శబ్దములు చేయుచుండగా మేల్కొలుపులను పొందుచు, వెలుగుల నాశ్రయించునట్టి శ్రీదేవిని ఉపాసన చేయుదుము. మమ్ము ఆ శ్రీదేవి అభిల షించి ప్రోత్సహించును గాక!

శ్రీర్మా దేవీ - అనగా వెలుగుల దేవత.

❀ వెలుగుల దేవత అనగా లక్ష్యం స్పష్టంగా ఉండుట.

బాహ్యపరిస్థితులు ఎలా ఉన్నా,

ఆ శ్రీర్మాదేవీర్జుషతామ్ - ఆ వెలుగుల దేవి నన్ను లక్ష్యం వైపు ప్రోత్సహించును గాక!

అశ్వపూర్వాం - సూర్యకిరణములు ముందు వచ్చి, అవి,

రథమధ్యాం - ప్రాణమయ, అన్నమయకోశములుగా పరిణితి చెంది,

హస్తినాద ప్రబోధినీమ్ - హస్తినాదము ద్వారా అనగా మూలాధారములో ఉన్నటువంటి వాక్‌శక్తి ద్వారా, మనోమయ విజ్ఞానమయ కోశముల లోకి వెళ్ళి అక్కడ ప్రబోధన చెంది, ఆ కోశములను మేల్కొల్పుతుంది.

ఇది నాదము, ప్రజ్ఞ యొక్క సంయోగము - మంత్రవిద్య.

గాయత్రీ మంత్రము యొక్క మూడు పాదములు - జాగ్రద, స్వప్న, సుషుప్త స్థితులు.

తాం శ్రియం ఇహ ఉపహ్వయే - ఆ శ్రీదేవిని నేను ఇక్కడకు, నా సమీపమునకు పిల్చుచున్నాను.







కాం సోస్మితాం హిరణ్యప్రాకారామ్
ఆర్ద్రామ్ జ్వలన్తీం తృప్తామ్ తర్పయన్తీమ్ ।
పద్మేస్థితాం పద్మవర్ణాం
తామిహోపహ్వయే శ్రియమ్ ॥

సః = అతడు, వేద పురుషుడు, కాం = ఎవతెను, అస్మితాం = అస్తిత్వముగా, నేనున్నాను అను ప్రజ్ఞగా, సంకల్ప స్వరూపిణిగా (పొందెనో), హిరణ్య ప్రాకారాం = బంగరువన్నె కిరణముల యావరణములు గల దానిని, ఆర్ద్రాం = ద్రవ స్వరూపిణిని లేక రసస్వరూపిణిని, ఎర్రని రంగు గూడ కలిగిన ఉదయారుణ సూర్యకాంతి గలదానిని, జ్వలంతీ = జ్వాలారూపము గల దానిని, తృప్తాం = తృప్తి గల దానిని, తర్పయంతీం = తృప్తిని కలిగించుచున్న దానిని, పద్మే = పద్మమునందు, స్థితాం = ఉన్నదానిని, పద్మ వర్ణాం = తమ్మిపువ్వు రంగు కలదానిని, పత్ + మ = పదముల శోభతో కూడిన రంగు కల దానిని, తామ్ శ్రియం = ఆ శ్రీదేవిని, ఇహ = ఇచ్చటకు, నా యందు స్థూల సూక్ష్మాది సృష్టి లోకమందు, ఉపహ్వయే = సమీపమునకు పిలుచుచున్నాము.

పరమపురుషుడగు నారాయణుడు, ఎవరిని తన అస్తిత్వముగా నేర్పరచుకొనెనో అట్టి కిరణమయ ప్రాకారము రూపముగల ఆమెను, రస స్వరూపిణిని, జ్వాలా స్వరూపిణిని, తృప్తి స్వరూపమై సృష్టికి తృప్తిని కలిగించు నామెను, పద్మమున నిలిచిన పద్మవర్ణమూర్తిని యగు నామెను, శ్రీదేవిని నాయం దావాహనము చేయుచున్నాను.

కాంసోస్మితాం హిరణ్యప్రాకారామ్ - ఎవతెను వేద పురుషుడు "నేను" ఉన్నాను అను ప్రజ్ఞగా పొందెనో,

సమర్థ సద్గురు స్పర్శ ధ్యాన విధానము.
సంకల్ప రహిత చేతనత్వము.

హిరణ్యప్రాకారామ్ - సూర్యకిరణములు ముందుగా ఆ జాతవేద లక్ష్మీ స్థితి చుట్టూ కిరణములను కందకములాగ ఏర్పరుస్తాయి.

-- అదే శ్రీచక్రము లోని భూపురము. ఈ భూపుర మండలం వల్ల మన కోరికకు జాతవేద మరియు లక్ష్మీస్థితి ఏర్పడుతుంది.

✧ శ్వాసపీల్చుకొని (తామిహోపహ్వయే శ్రియమ్) మూలాధారము నుంచి (త్స్నాద ప్రబోధినీమ్) పైకి వెళితే స్వాధిష్ఠానము వద్ద మూలాధారము యొక్క ఎరుపుజీరకి తడి తగులుతుంది (ఆర్ద్రామ్).

ఆ పైన మణిపూరకం వద్ద నీచ మనస్సు వద్ద (జ్వలన్తీం) రూపు దాలుస్తుంది.

-- కావలసిన నిష్పత్తిలో కనుక తరంగములు ఏర్పడకపోతే మళ్ళీ (తృప్తామ్) పరిపూర్ణమైన శ్వాస లోనికి పీల్చుకొంటూ మూలాధారాన్ని తడిపితే (తర్పయన్తీమ్) మూలాధార, స్వాధిష్ఠాన, క్రింది మణిపూరక ములు కావలసిన పదునులో పడతాయి.

'పద్మేస్థితాం పద్మవర్ణాం' - ఆ కావలసిన వైబ్రేషన్స్ లేక వర్ణమాలను అక్షరముల ద్వారా ఇవ్వటము.

❀ పద్మము అనగా వాక్‌శక్తి - చేతనత్వము యొక్క సంకేతము.

❀ బురద అంటే మూలాధారం + స్వాధిష్ఠాన చక్రముల కలయిక.

పిండిని నీరు వేసి తడిపిన విధంగానే మూలాధార, స్వాధిష్ఠాన చక్రముల కలయిక ఉండాలి.

ఆర్ద్రామ్ - కుమ్మరి కుండలు తయారు చెయ్యటానికి పృథ్వీ తత్త్వం, జల తత్త్వముల యొక్క నిష్పత్తిని ఎలా గమనించుకుంటాడో, ఆ గమని కను కలిగి ఉండాలి.



జ్వలన్తీం - బియ్యం ఉడకటానికి కావల్సిన వేడి, సమపాళ్ళలో నీరు లేకపోతే (స్వాధిష్ఠాన చక్రం) అన్నం తన స్వరూపాన్ని కోల్పోయి జావగానైనా అవుతుంది లేక పలుకుగానైనా అయిపోతుంది.

అలాగే తల్లి గర్భంలో శిశువు పెరుగుదల తెల్పే విధానమును (కపిలుడు, వీరబ్రహ్మంగారు చెప్పిన పిండోత్పత్తి) తల్లి యొక్క మూలాధార, స్వాధిష్ఠాన చక్రములకు అన్వయించుకోవాలి.

తల్లి యొక్క ఈ మూలాధార, స్వాధిష్ఠాన చక్రాలు సృష్టిలో జీవించ డానికి అనువుగా కావలసిన నిష్పత్తిలో ఉంటేనే శిశువు క్రమంగా పెరిగి 9 నెలలలో జీవిగా బయటికి వస్తాడు (యదన్నే నాతిరోహితి).

తృప్తామ్ - కోరిక తీరటానికి తృప్తి కలిగి ఉండాలి. అనుకొన్న స్వరూపం రూపుదాల్చటానికి అన్ని చక్రాలు పూర్తిగా సంతృప్తి చెంది ఉండాలి.

❀ మెషిన్‌ను బాగుగా కడిగి శుభ్రం చేసి నూనె వేసినట్లే ఆహారములో నీరు, నూనె పదార్థాల కలయిక ఉండాలి.

శ్రీ తీపి తృప్తిని కలుగజేస్తుంది. అందువల్లనే బయటకు వెళ్ళేటప్పుడు తప్పని సరిగా ఒక 1/2 స్పూన్ తేనె నాకి వెళ్లటం మంచిది.

ఆ తృప్తిని అనుభూతి చెందింపచేయుటకే గర్భిణీ స్త్రీకి కావలసినవి తినిపించండని పెద్దలు చెప్తారు. రుచికరమైనది కాదు. (కొందరు స్త్రీలు గర్భిణిగా ఉన్నప్పుడు అరుచికరమైన పదార్థాలను తినడం మనం చూస్తూనే ఉంటాము. చాకపీసులు, మట్టిబెడ్డలు, బియ్యం మొదలైనవి.)

గర్భస్థ శిశువు (స్త్రీ లేక పురుషుడు) అది రూపుదాల్చడానికి కావల సిన ఆహారాన్ని తల్లికి ఇవ్వాలి. అదే శిశువు వ్యాపారవేత్త కావాలనుకొంటే, రాజనీతిజ్ఞుడు కావాలనుకుంటే, వైజ్ఞానికుడు కావాలనుకుంటే, అభినేత కావాలనుకుంటే, సాహితీవేత్త కావాలనుకుంటే వారికి అనువైన రీతిలో ఆ గుణాలకు కావలసిన ఆహారము గర్భిణీ స్త్రీలకి ఇవ్వాలి.

తర్పయన్తీమ్ - తృప్తి చెందినటువంటి ఆహారము శిశువుకు ప్రోధి చేయటానికి

కావలసిన రసములను కురిపిస్తుంది.

దానినే తర్పణ అంటారు (తడపటము). గింజలు మొలకెత్తించటానికి తడిసిన గుడ్డ ఎలాగ అవసరమో అలాగ.

పద్మేస్థితాం - పదములలో ఉండుట. అందుకే దేవతలందరు పద్మములో ఉంటారు. అంటే వాళ్ళని వాక్‌శక్తితో కంట్రోలు చేయవచ్చును.

-- అవే దేవతలకు సంబంధించిన మంత్రాలు.

(మంత్రము, దేవత వేరు కాదు.)

పద్మవర్ణాం - ఆ దేవతా శక్తులకు పదములలో మీరు ఏ రంగు ఇస్తారు? అంటే దేనికి ఉపయోగించుకోవాలి? దానినే ధ్యాన శ్లోకాలలో తెలిపారు.

తామిహోపహ్వయే శ్రియమ్ - ఆ వాక్‌శక్తిని (శ్రీదేవిని) నా యందు స్థూల సూక్ష్మ లోకమందు ఉపహ్వయే, సమీపమునకు పిలుచుచున్నాను.

కాం - కిరణ స్వరూపిణి.

సతీ - జీవాత్మ, అస్మితాం - అంటే నేను అనే ప్రజ్ఞ కలవారై,

హిరణ్యప్రాకారామ్ - నీచ మనోమయకోశం సంపూర్ణ సృష్టికి నీకు మధ్య ప్రాకారముగా ఉంటుంది. శ్రీచక్రములో ఉండే భూపురం ఈ ప్రాకారమే. అనగా నీ యొక్క చర్మమె! అదే సర్వమావృత్య తిష్ఠతి.

చర్మమే వాసుదేవుడు. వాసుదేవుడు అనగా వసంతి దేవాః అత్ర సంతి ఇతి వాసుదేవః. ఈ చర్మము లోపల దేవతలు అందరూ నివసిస్తూ ఉంటారు. అదే అవధూతల సర్వ వ్యాపకత్వము, దిగంబరతత్వము.

(బ్రీతింగ్ ఎక్సర్‌సైజెస్ వల్ల ఆ స్థితిని సాధించవచ్చును).

**సాధకులకు అభ్యాసము:** థాట్ ఫార్మ్ నిర్మించటాన్ని గర్భస్థ శిశువుతో పోల్చుము.







చన్ద్రాం ప్రభాసాం యశసా జ్వలన్తీం
శ్రియం లోకే దేవ జుష్టా ముదారామ్
తామ్ పద్మినీం ఈం శరణ మహం ప్రపద్యే
అలక్ష్మీ ర్మే నశ్యతాం త్వాం వృణే ॥

చంద్రాం = చంద్రతత్త్వము గలది, షోడశ కళాత్మకమైనది, ప్రభాసాం = ప్రశస్తమైన వెలుగు గలది, యశసా = ప్రశస్తిచే (ప్రసిద్ధికి వలసిన లక్షణములచే), లోకే = లోకమునందు, జ్వలంతీం = ప్రకాశించు దానిని, దేవజుష్టాం = దేవతల మక్కువను చూరగొనిన దానిని, ఉదారాం = దానము చేయు గుణము కల దానిని, పద్మినీం = పద్మ లక్షణములు గల యామెను, ఈం = ఈంకార స్వరూపిణి, తాం = ఆమెను (అట్టి శ్రీదేవిని), అహం = నేను, శరణము పొందుచున్నాను, త్వాం = నిన్ను, వృణే = వరించుటయందు (ఆవరించుట యందు), మే = నా యొక్క, అలక్ష్మీ = అశుభ లక్షణము, నశ్యతాం = నశించును గాక.

చంద్రాత్మకమైనది, వెలుగులను వెదజల్లునది, ప్రశస్తిచే లోకమునందు (లోకములుగా) వెలుగుచున్నది, దేవతల ప్రీతిని చూరగొన్నది, ఔదార్యము గలది, పద్మ లక్షణములు గలది, ఈంకార స్వరూపిణియగు ఆ శ్రీదేవికి నేను శరణాగతి చేయుచున్నాను. నిన్ను వరించుట వలన నా యందున్న అలక్ష్మి నశించును గాక!



అలక్ష్మీ ర్మే నశ్యతాం త్వాం వృణే - ఏ లక్షణాలను పొంద దల్చుకొన్నామో, దానికి అనుకూలంగా లేని లక్షణాలు ముందు తీసివేసుకోవాలి. ఆ తరువాత తగిన లక్షణాలను పెంచుకోవాలి.
దానికి తగిన సాధనలు చేయటానికి శక్తిని ఇమ్మని ప్రార్థన.

చన్ద్రాం - సూర్యుని కిరణాలను చంద్రుడు ఏ విధముగా ప్రతిబింబింప చేస్తాడో, సాధకుడు తన ఆత్మ చేతనత్వపు కిరణాలను మనో వాక్కాయ కర్మల ద్వారా ప్రతిబింబింప చేయాలి. ఆ ఆత్మ యొక్క ప్రభ, యశస్సు అతనిలో జ్వలించాలి (ప్రభాసాం యశసా జ్వలన్తీం).

దేవ జుష్టా ముదారామ్ - దేవతలు కూడా కోరుకొనేటటువంటి ఔదార్యము గలది, అనగా ఊర్ధ్వముఖ కిరణాలు కలది, ప్రజ్ఞా స్వరూపిణి.

శ్రియం లోకే - ఈ లోకములలో

తామ్ పద్మినీం - ఆ పద్మములు కలది. అనగా సూర్య కిరణముల వల్ల, వికాసము చెందు లక్షణము గలది.

అనగా సాధకులలోని షట్ చక్రాలు, ఆ కిరణాలు అనగా దళముల మీద ఉన్న అక్షరమాల వల్ల వికసించునది.

ఈఈఈఈఈఈఈమ్మ్మ్మ్మ్ అనే శబ్దతరంగాల వల్ల ప్రోధి చెందే శక్తి, నన్ను వరించుగాక!



ఆదిత్యవర్ణే తపసోఽధిజాతో
వనస్పతి స్తవ వృక్షోఽథబిల్వః ।
తస్యఫలాని తపసానుదన్తు
మాయాన్తరాయాశ్చ బాహ్యా అలక్ష్మీః ॥

ఆదిత్య వర్ణే = ఆదిత్యుని వర్ణము గలదానా ! తపసః = తపస్సులకు, అధిజాతః = అధిష్ఠానముగా పుట్టినది యగు, వనస్పతి = వనస్పతి యను జాతికి చెందిన, వృక్షః = వృక్షము, అథః = అటుపైన (తపస్సునకు అనంతరముగా పుట్టిన), బిల్వః = మారేడు చెట్టు, తస్య ఫలాని = దాని యొక్క ఫలములు, తపసా = తపస్సుచేత, అంతరాయా+చ = లోపలి నుండి కలుగునవియు, బాహ్యా+చ = పరిసరముల నుండి కలుగునవియు అగు, అలక్ష్మీః = అలక్ష్మీ కరములగు, మాయాః = మాయా సంభవ లక్షణములను, నుదంతు = పోగొట్టును గాక!

ఆదిత్యుని వర్ణముతో వెలుగొందు ఓ శ్రీదేవీ! నీ తపస్సుచేత అధిష్ఠించి పుట్టినది బిల్వము అను వనస్పతి. దాని ఫలములు మా తపస్సుచేత, మాలోని మాయా సంభవములైన లోపలి, వెలుపలి అవలక్షణాలను తొలగించు గాక!

ఆదిత్యవర్ణము - మానవీయ చేతనత్వము జాగృత్, స్వప్న, సుషుప్తి అనే 3 విభిన్న ఎరుకలతో ఉంటుంది.

① జాగ్రదావస్థ వ్యక్తి యొక్క చర్మము లోపల ఉన్న స్థితికి, బయట ఉన్న స్థితికి ఉన్న తేడా తెల్పుతుంది. నా యొక్క చర్మము బయట ఉన్నదంతా ఇతరులు. చర్మము, లోపల ఉన్నదంతా నేను, నాది.

② స్వప్నావస్థలో ప్రతీదీ నేనే.

③ సుషుప్తిలో "నేనున్నాను" తప్ప ఇంకొకటి లేదు. ఇంకొకటి లేకపోతే మనము అనుభూతి చెందలేము కనుక అది చీకటి అనిపిస్తుంది. అది అనుభూతి రహితస్థితి. దేవతలకి తల్లి అయిన "అదితి" స్థితి.

నేను అనే చేతనత్వము ఈ అన్ని స్థితులలోను ఒకే రకంగా ఉంటుంది. దాని యొక్క ప్రకంపనాలే "అదితి" అస్మితగా మారడం. వెలుగులకు తల్లి, చేతనత్వ అనుభూతికి తల్లి అదే - ఆదిత్య వర్ణము.

తపసోऽధిజాతో వనస్పతి - తపస్సులకు అధిష్టానంగా పుట్టినదైన 'వనస్పతి' అను జాతికి చెందినది.

❀ పువ్వులు కనిపించకుండానే కాయలు కాచే జాతి వనస్పతి.

శ్రీ తపస్సు అనగా సమయ సంయమనం, ఇంద్రియ సంయమనం, వాక్ సంయమనము, అర్థ సంయమనము.

ఈ నాలుగు సంయమాలను అధిష్టించి పుట్టిన ఫలము అనగా ఈ సంయమాల యొక్క ఫలితం ఎప్పుడు పడితే అప్పుడు మనిషి పొందగల గాలి. అనగా ఈ తపస్సు అతని అలవాటులో భాగం కావాలి. ఈ 4 సంయమాలు ప్రకృతిలోని భాగాలని గుర్తించాలి. ప్రకృతిలో అవి సర్వజనీనము.

ఉదా: సూర్యుడు, ఇతర గ్రహాల సమయ సంయమము మనకు తెల్సినదే గద. ఇతర ప్రాణులకి ఎంత వాక్ సంయమనమున్నదో తెలుస్తూనే ఉన్నది. చాలా అల్ప శబ్దములతో జంతువులు తమ పనిని జరుపుకుం



టాయి. ఖనిజాలు, వృక్షాలు అసలు వాక్‌ని ఉపయోగించుకోవు.

❀ కానీ గ్రహాలను నియామకం చేయటానికి అవి ఎంత అర్థవంతమైనవో అనే విషయము ఖనిజజగత్తులోని రత్నాలు తెల్పుతాయి.

ఇలాంటి అనేక ఉదాహరణలు మనం గమనించవచ్చును.

తపస్సనేది మానవ జంతువులకే అవసరము. తపస్సు అయిన తర్వాత అతని ప్రజ్ఞ 5 రకాలుగా వికశించవచ్చును.

① వ్యాపారవేత్త - సంపద యొక్క అధిష్టాత.

② రాజనీతిజ్ఞుడు - పృథ్వీ మీద అధిపతి.

③ వైజ్ఞానికుడు - ఖనిజ, వృక్ష, జంతు (మినరాలిస్ట్, బోటనిస్ట్, జువాలజిస్ట్) జగత్తులలోని నియమాల అధిజాతుడు.

④ అభినేత - ఈ 3 నియమాలు తెలియకపోయినా తెలిసినట్లు నటించేవాడు.

⑤ సాహితీవేత్త - అభినేతకు కావలసిన వాక్‌ను అందించేవాడు.

ఈ విధంగా తపస్సు వల్ల 5 రకాల వ్యక్తిత్వాలు ఏర్పడతాయి. ప్రజ్ఞలు ఏర్పడతాయి. ఆదిత్య వర్ణాలేర్పడతాయి. ఈ ఐదింటికి చెందని వారు - తపస్సు చెయ్యటం లేదని అర్థము. దీనిని గమనించుకొని "శ్రీ" కావలసినవాడు తనకు నచ్చిన ఆదిత్యవర్ణమును ఉపయోగించుకోవచ్చును.

**సూర్యకిరణములలో,**

| | | |
|---|---|---|
| 1 వ కిరణము - | రాజనీతిజ్ఞుడు - | సంకల్పము |
| 2 వ కిరణము - | సాహితీవేత్త - | ప్రేమ, ప్రజ్ఞ |
| 3 వ కిరణము - | వైజ్ఞానికుడు - | కర్మ |
| 4 వ కిరణము - | అభినేత - | సమన్వయం |
| 5 వ కిరణము - | వ్యాపారవేత్త - | విజ్ఞానము |

సూర్యుని యొక్క 7 కిరణాలు -

1. సంకల్పము   2. ప్రేమ, ప్రజ్ఞ   3. క్రియాశీలత
4. సంతులన   5. విజ్ఞానం   6. భక్తి
7. వ్యవస్థ

జ్వాలాకూల్ మహర్షి 3 రకాలైన ఆదిత్యవర్ణములతో (2,4,6) వృక్షజగత్తు ఏర్పడుతుందని చెప్పాడు. ఆ మూడు కిరణాల ఎఫెక్ట్ బిల్వ పత్రాల 3 రేకులలో కన్పిస్తుంది. ఆ మూడు కలసి ఒకటిగానే ఉంటాయి. అందువల్లే బిల్వవృక్షము 'శ్రీ'దాయకం మరియు శ్రేయోదాయకం.

1, 2, 3 కిరణముల సమన్వయం అనగా 4 వ కిరణము. రాజనీతి జ్ఞుడు, సాహితీవేత్త, వైజ్ఞానికుల యొక్క సమన్వయ స్వరూపము అభినేత - దాని యొక్క Distant echo.

వీటన్నింటినీ అవసరమున్న చోటకు చేరుస్తూ అందరికీ ఉపయోగ పడేటటువంటి చేతనత్వం "వ్యాపారవేత్త". అతను సంపదలను సమీకరించి, ఉపయోగించుకుంటూ అందరికీ భగవంతుని వలే ఉపయోగపడతాడు. ఏ గురు చేతనత్వము యొక్క పనీ, అతని సహకారం లేకుండా జరగదు.

బిల్వవృక్షము యొక్క ప్రతీ కణము ఈ సమన్వయాన్ని సాధించి పెట్టగలదు. అందుకే "తపసోఽధిజాతో వృక్షోఽథబిల్వః"

తస్యఫలాని తపసానుదన్తు మాయాన్తరాయాశ్చ బాహ్యా అలక్ష్మీః

ఈ మానసికస్థితి యొక్క ఫలాలు (ఎవరికి వారు, వారి యొక్క తపఃఫలములుగా గుర్తుంచుకోండి) వలన ఆంతరిక, బాహ్యమైన "జాతవేద లక్ష్మీస్థితి"కి భిన్నంగా ఉన్న లక్షణాలు (అలక్ష్మీః) తొలగుతాయి.

మాయ – అనగా అదితి చేతనత్వమును గుర్తించకుండా వుండేస్థితి.







ఉపైతు మాం దేవసఖః
కీర్తిశ్చ మణినా సహ ।
ప్రాదుర్భూతోఽస్మి రాష్ట్రేఽస్మిన్
కీర్తిమృద్ధిం దదాతు మే ॥

దేవసఖః = దేవతలకు సఖుడు అగు కాముడు, కీర్తిః + చ = కీర్తియును, మణినా సః = మణితో కూడ, మాం = నన్ను, ఉప + ఏతు = సమీపించును గాక, అస్మిన్ రాష్ట్రే = ఈ రాష్ట్రమునందు, ప్రాదుర్భూతః + అస్మి = ఉద్భవించితిని, మే = నాకు, ఆ కాముడు, కీర్తిం = కీర్తిని, వృద్ధిం = సంవృద్ధిని, దదాతు = ఇచ్చును గాక.

కీర్తి తోడను, మణులతోడను కలసి దేవతలకు సఖుడగు కాముడు నా కెదురు వచ్చి సమీపించును గాక! నే నుద్భవించిన ఈ రాష్ట్రమునందతడు నాకు సమృద్ధిని కలిగించును గాక!

ప్రాదుర్భూతోస్మి రాష్ట్రేస్మిన్ - ప్రతీరోజు నిద్రలేవగానే శరీరములు అనబడే ఈ రాష్ట్రములలో ఉద్భవిస్తున్నాము.

(ప్రాతః సంధ్యా వందనములో ఈ రాష్ట్రోత్పత్తిని గమనించుకోవాలి.)

✧ ఈ శరీరమును ధరించుట అనేది మన అహంకారము - చిత్తము, బుద్ధి - మనస్సు వల్ల ఏర్పడుతోందని గ్రహించాలి.

-- అహంకారం బల్బ్ వలె వెలుగుతూవుంటే,

-- మనస్సు అనేక పరిస్థితులను ఫిలిమ్స్‌లో పొందుపరిస్తే,

-- నిర్ణయాత్మకమైన బుద్ధి కావలసిన ప్రింట్స్‌ని దేశము - కాలము అనే స్క్రీన్ (తెర) మీద సంఘటనలుగా రూపొందిస్తుంది.

శ్రీ పై ఉదాహరణను అర్థం చేసుకుంటే ఎంత అసంభవమైన సంఘటనలైనా మార్చుకోవచ్చును. అదెంత సులభమో గూడ తెలుస్తుంది.

దేవసఖః - మన శరీరములో ఉన్న పంచతత్వాలు ఆ దేవతల యొక్క సఖులే. అనగా ఆ దేవతల వలెనే ప్రవర్తిస్తారు.

కీర్తిశ్చ మణినా సహ - అందరికీ మంచి చేసే పనులు కీర్తిని సంపాదించి పెడతాయి. అందువల్ల కీర్తి అనేది సామూహిక శ్రేయస్సును అందజేసే పనులు వలన వస్తుంది.

రావణాసురుడు శ్రీమంతుడే, కానీ కీర్తివంతుడు కాదు.

❋ స్వప్రయోజనము కొరకు ఏమి చేసినా అది రాక్షసీవృత్తే. అది కీర్తిని కలిగించదు.

వారు ప్రాకృతిక శక్తులను సామూహికంగా వాడుటలేదు కనుక "స్తేన ఏవసః" అని జగద్గురువు అన్నాడు.

ఉదా: గాలి పీల్చుకున్నాం. మళ్ళీ వదిలేసి ప్రకృతిలోని వృక్షములకు ఆహారముగా ఇస్తున్నాం. ఆహారం తీసుకుని మనం వదిలిన మలము,



ఎరువుగా పనిచేస్తుంది.

❋ అందువల్ల, అపరిగ్రహ వృత్తి మరియు అస్తేయవృత్తి వ్యక్తిగతమైన కీర్తిని సంపాదించి పెట్టటమే కాకుండా, సామూహిక శ్రేయస్సుకు కారణభూత మౌతాయి.

మణినా సహ - మణి అనే పదమును - రత్నమని కూడా అంటాము. అవి స్వయంప్రకాశములగు మనోధర్మముల సముదాయము.

ఖనిజజగత్తులోని రేడియో ధార్మికత ఈ స్వయం ప్రకాశతత్వము యొక్క ధర్మము. ప్రతీ వృక్షము, వనస్పతీ కూడా తమదైన విశిష్టమైన స్వయం ప్రకాశక లక్షణములు తెలుపుతుంది.

❋ అందువలన మనిషి యొక్క 5 ఇంద్రియములు 5 మణులుగా మారాలి.

-- ఆ ఇంద్రియాల్ని అస్తేయ, అపరిగ్రహాలకి వాడితేనే అవి మణులుగా రూపొందుతాయి.

-- అప్పుడు సహజంగానే వాటి నుంచి ఉద్భవించే వాక్‌శక్తి ఈ శరీరమనే రాష్ట్రములో కీర్తిని, అభివృద్ధిని సాధించిపెడతాయి. (మంత్రవిద్య).

ఉపైతు మాం - వాటిని నేను పొందుదును గాక! అనగా ఈ స్థితి రావటానికి అతని ప్రయత్నము కంటే ప్రకృతి యొక్క సహకారమే ఎక్కువ.





క్షుత్పిపాసా మలాం జ్యేష్ఠా
మలక్ష్మీర్నాశయామ్యహమ్
అభూతి మసమృద్ధిం చ
సర్వాన్నిర్ణుదమే గృహాత్

క్షుత్ = ఆకలి, పిపాసా = దప్పిక, మలాం = మల స్వభావము గల దానిని, జ్యేష్ఠాం = జ్యేష్ఠా దేవిని, అనగా దారిద్ర్య దేవతను, అలక్ష్మీః = శుభ లక్షణ ములకు వ్యతిరేకమైన దానిని, అహం = నేను, నాశయామి = నశింపజేయు చున్నాను, అభూతిం = సంపద లేకుండుటను, అసమృద్ధించ = సమృద్ధి లేకుండు టను, సర్వాం = సమస్త స్వరూపమగు జ్యేష్ఠా దేవిని, మే గృహాత్ = నా యింటి నుండి, నిర్ణుద = పొగొట్టుము.

ఆకలి దప్పుల మలిన లక్షణము గల జ్యేష్ఠాదేవి యనబడు అలక్ష్మిని నేను నశింపజేయుదును. సంపద, సమృద్ధి నా ఇంటి నుండి తరుగకుండ అనుగ్రహించి నీవును అలక్ష్మిని పోగొట్టుము.



క్షుత్, పిపాసాం, మలాం, జ్యేష్ఠా, అలక్ష్మీర్ - క్షుత్ అంటే ఆకలి. భౌతికమైన ఆకలియేగాక రకరకాల ఆకళ్ళు ఉంటాయి.

- ఏ విధమైన ఆకలికి లొంగకుండా ఉండే స్థితి మొదటి మణి.
- -- గురువులు అందరూ అనేక మందికి ఆకలికి ఆహారం పెట్టగల్గే మానసిక స్థితి ఈ మనోధర్మము వలననే ఏర్పడుతుంది.

క్రైస్ట్ యొక్క - 2 రొట్టెలు, 5 చేపలు,
వశిష్ఠ మహర్షి - రాజైన విశ్వామిత్రునికి ఆహారం పెట్టటం,
ప్రతీ ఆశ్రమములోనూ ఉచితంగా ఆహారం పెట్టే విధానం ఈ మణి వల్లే జరుగుతుంది.

- దాహం లేని మనోధర్మం - 2వ మణి.
- -- ఆకలి తీరితే మరింక ఎక్కువ అడగవు. కానీ దాహానికి అంతులేదు. ధనదాహం, కీర్తిదాహం మొదలైనవి.
- శ్రీ "నేచర్ ఈజ్ ఆల్వేస్ రైట్" అనే మానసిక స్థితే దాహమును తీర్చే స్థితి. ఆ స్థితిలో ఉన్నవారు ఎవరి దాహమునైనా తీర్చగలరు.

విశ్వామిత్రుడు తాటక సంహార నిమిత్తము రామ లక్ష్మణులను తీసుకువెళ్ళే మార్గమధ్యంలో వారికి ఆకలి, దప్పులు కలుగకుండా ఉండే టందుకు బల, అతిబల అనే విద్యలను నేర్పించాడు.

- అదే గాయత్రీ, సావిత్రీ మంత్రదీక్షలని పూజ్య గురుదేవులు చెప్పారు.
- -- అంటే ఈ విద్యను ఉపాసించిన వారు భౌతిక జగత్తుకు సంబంధించిన కోరికలు, వ్యామోహాలకు అతీతంగా కర్మసాక్షులుగా ఉంటారు.
- మలం - 3వ మణి - మల స్వభావమును దాటివేసే మానసికస్థితి.
- -- పదార్థములను దాచుకుంటే అవి మలంగా మారతాయి. (ఉదాహరణ బ్యాంకింగ్, హోర్డింగ్.)

❀ రేపటి కొరకు వస్తువుల్ని దాచుకొనకూడదు.
ఏ రోజు కారోజు జీవించి, మరణించుటే ఈ మణిని పొందుట.

-- శిరిడీ సాయి జీవితం ఈ మణికి ఉదాహరణ.

జ్యేష్ఠాం - ఈ 3 లక్షణాలను కల్గిన సమ్మిళిత ధర్మము.
ఆకలి, దప్పులు, మలము కలసిన స్థితి ఇది.

శ్రీ ఈ మూడింటిని మన మనస్సులో నుంచి తీసివేసే వనస్పతి - బిల్వవృక్షము - లేక త్రిశూలము.

అలక్ష్మీం - ఆత్మీయ చేతనత్వమునకు విరుద్ధమైన లక్షణాలు.

శ్రీ దీనిని పోగొట్టే మణి అనన్యచింత వలన లభిస్తుంది.

ఈ 5 మణుల ద్వారా 'అలక్ష్మీర్నాశయామ్యహమ్'

తద్వారా,

అభూతి మసమృద్ధిఞ్చ సర్వాన్నిర్ణుదమే గృహాత్ - సంపద లేకుండుట, సమృద్ధి లేకుండుట అనే జ్యేష్టాదేవి లక్షణాలు నా శరీరంలో లేకుండా ఉండుగాక!

మానవీయ సంపద పెరగదు. కానీ సరైన క్షేత్రంలో నాటితే ప్రాకృతిక సంపద ఖచ్చితంగా అభివృద్ధి చెందుతుంది. దీనినే 'నాటు - కోసుకో' అనే విజ్ఞానంగా గురుదేవులు అందించారు.







గంధద్వారాం దురాధర్షాం
నిత్యపుష్టాం కరీషిణీమ్ ।
ఈశ్వరీగ్ం సర్వ భూతానాం
తామిహోపహ్వయే శ్రియమ్ ॥

గంధద్వారాం = గంధమే తన ద్వారముగా కల దానిని, సుగంధముతో కూడిన ద్వారము గల దానిని, దురాధర్షాం = తేలికగా సమీపించుటకు వీలుకాని దానిని, జంకు కలిగించుటకు సాధ్యపడని దానిని, నిత్యపుష్టాం = నిత్యము పుష్టియైన దానిని. కరీషిణీం = కరములచే, అనగా కిరణములచే పొందబడిన ఈషణములు కలదానిని. ఈషణము లనగా ఆకార రేఖలు లేక అభిలాషలు, సర్వభూతానాం = సమస్త జీవరాశులకు, ఈశ్వరీం = అధి దేవతయైన దానిని, తాం శ్రియం = ఆ శ్రీదేవిని, ఉపహ్వయే = సమీపించుటకు ఆహ్వానించు చున్నాను.

సుగంధముతో కూడిన ద్వారము గల దానిని, తేలికగా సమీపించుటకు వీలుకాని దానిని, జంకు కలిగించుటకు సాధ్యపడని దానిని, నిత్యము పుష్టియైన దానిని. కిరణములచే పొందబడిన ఈషణములు కలదానిని. సమస్త జీవరాశులకు అధి దేవతయైన దానిని, ఆ శ్రీదేవిని సమీపించుటకు ఆహ్వానించుచున్నాను.

గంధద్వారాం- గంధమే తన ద్వారముగా గలది.

-- సంపదల్ని అభివృద్ధి చేసే జాతవేద స్వరూపిణియైన లక్ష్మీ దేవి "వాసనలను" తన పనిముట్టుగా చేసుకుంటుంది.

ఎలాంటి వాసనలు మనకి ఉంటాయో, అలాంటి శరీరమే మనకి ఉంటుంది. ఎలాంటి వాసనలు ఉండకూడదో క్రింద చెప్పుకుందాం.

ఒకసారి ప్రాకృతిక సంపదలు పెంచే వాసనలు మనలోకి చొరబడితే అవి,

దురాధర్షాం - తేలికగా మార్చుకోలేము.

-- అంటే ఆ స్థితి నిరంతరం కొనసాగుతుంటుంది.

నిత్యపుష్టాం - నిత్యమూ పుష్టియైన దానిని, అనగా నిరంతరం తానున్న చోట సకల జీవులకి పుష్టినిచ్చేదిగా ఉంటుంది.

గురుదేవుల ఆశ్రమంలో, అనగా శాంతికుంజ్ ఆశ్రమం, హరిద్వార్ లో వనౌషదీ విజ్ఞానం ద్వారా వనస్పతులకు, యజ్ఞవిద్య ద్వారా సమస్త ప్రాణులకు పుష్టి ఎలా ఇవ్వబడుతోందో గమనించుకోవచ్చును.

నిరంతరం మన చుట్టుప్రక్కల ఉన్నవారికి పుష్టినిచ్చే మానసికస్థితి, వాక్శక్తి ద్వారా మనుష్యులకి ఉత్సాహాన్ని ఇచ్చే మానసికస్థితిని పొందుతాము.

కరీషిణీమ్ – చేతులు, చేతల ద్వారా కార్యసాధన కలుగచేసేది. అభ్యాసం ద్వారా రుచిని పెంపొందించేది. అలవాటుగా మారుట. అంతేకాక ఈషణములు లేక ఆకార రేఖలు లేక అభిలాషలు కలిగినది.

ఈశ్వరీగ్ం సర్వ భూతానాం తామిహోపహ్వయే శ్రియమ్ - సమస్త జీవులకు అధి దేవతయైన ఆ శ్రీదేవిని ఆవాహన చేయుచున్నాను.







మనసః కామమాకూతిం
వాచః సత్యమశీమహి ।
పశూనాగ్ం రూపమన్నస్య
మయి శ్రీశ్శ్రయతాం యశః

మనసః = మనస్సు యొక్క, కామమ్ = కోరికను, ఆకూతిమ్ = కుతూహలమును, వాచః = వాక్కు యొక్క, సత్యం = సత్యమును, పశూనాం = పశువుల యొక్క, అన్నస్య = అన్నము యొక్క, రూపమ్ = రూపములు, అశీమహి = నీ యందు రూపొందించుకొని అనుభవించెదము, యశః= కీర్తి స్వరూపమగు, శ్రీ = శ్రీదేవి, మయి = నాయందు, శ్రయతామ్ = ఆశ్రయమును చెందును గాక!

మనస్సు యొక్క కోరికను, కుతూహలమును, వాక్కు యొక్క సత్యమును నీయందు రూపొందించుకొందుము. పశు సంపద యొక్క, అన్నము యొక్క రూపమును నీయందు రూపొందించుకొందుము. కీర్తి స్వరూపమగు శ్రీదేవి నాయందు ఆశ్రయము చెందును గాక!

మనసః కామం ఆకూతిం - మనస్సు అనగా ఆ విరాట్ పురుషుని యొక్క కోరికల ప్రవాహము (స కామయతః).

మనస్సు నుండి వచ్చే ఆలోచనల (కోరికలు) ప్రభావం మన వశములో లేదు అనే అనుభవం అందరికీ తెల్సిందే!

❋ కోరికలనగా ఆలోచనలు.
ధ్యానములో ఈ ఆలోచనల్ల ప్రవాహం గమనించుటే మొదటి స్థితి.

❋ నీవు ఆలోచించుట లేదు!
ఆలోచన్ల ప్రవాహం ప్రకృతిలో ఉంది అని ముందు తెలుసుకోవాలి.

ధ్యాన సమయంలో మనస్సు నుండి వచ్చే ఆలోచనా ప్రవాహము వల్ల ధ్యానం చేస్తున్న నాకీ మంచి ఆలోచన వచ్చింది అనుకుంటాం. అది నా ఆలోచన అని కూడా అనుకుంటాం.

అదే స్థితిలో ఒకడిని సోడాకాయతో బుర్రబద్దలు కొట్టాను అనే ఆలోచన కూడా వచ్చింది. అది కూడా నా ఆలోచనే అనుకుంటాం.

❋ అది సరికాదు. ఈ విశ్వ ప్రవాహంలో మంచి ఆలోచన, చెడు ఆలోచన రెండూ నిరంతరం ఉంటూనే ఉంటాయి.

గంగానదిలో ఒక కుళ్ళు శవం ప్రవాహదిశగా పోతూవుంటుంది.
ఆ దిశలోనే ఒక గులాబిపువ్వు పోతుంది.
అదే దిశలో ఒక ఎండు ఆకు కూడా ప్రవహిస్తోంది.

❋ ఈ కుళ్ళు శవము, గులాబి పువ్వు, ఎండు ఆకుల్లో ఏది నువ్వు తీస్తావు అన్నది నీ సంస్కారాన్ని బట్టే తీయడం జరుగుతుంది.

-- నీ సంస్కారపు జల్లెడను బట్టి అది బయటకు వస్తుంది.

-- ప్రవాహం యొక్క సంస్కారం బట్టి కూడా ఉంటుంది.

దానినే పవిత్రత అంటాము.



గంగానదిలో కుళ్ళు శవం కొట్టుకుపోతున్నా అది పవిత్రం అని అంటాము. మురికి నీటిలో గంగాజలము పడ్డా, దాన్ని మురికి నీరు అనే అంటాము.

నీ జల్లెడలో ఇది నాది అని నీవే పట్టుకుంటావు.

*బాబా ఏం చేస్తాడు?*

నమ్మకం ఉంటే కుళ్ళిన ఆకుని నీ చేతిలోనుంచి తీసి, గులాబీ పువ్వు చేతిలో పెడతాడు.

ఈ రెండూ ప్రవాహంలోనివే. ఆ ధ్యానములోని fluidity పైనుంచి అలా వస్తోంది. ఇది మనది కాదు.

❋ అందరూ ఆ కాలప్రవాహములోని బుడగలే.
ఆ ప్రవాహములో రావణుడూ ఉన్నాడు, రాముడు కూడా ఉన్నాడు.

ఏ బుడగ మంచిది అంటే, రావణుడు అంటే మండోదరికి చాలా మంచివాడని అభిప్రాయం. అదే రావణుడు సీతకి చెడ్డవాడు.

నీ సంస్కారాన్ని బట్టి ప్రవాహం నుండి ఏది తీస్తావో అదే వస్తుంది.

మానవశరీరధారి ఈ ఆలోచన్ల పరంపర తన సృష్టి అనుకుంటాడు.

❋ ప్రకృతిలో నామరూపాలున్న ప్రతీదీ ఈ భగవంతుని మనస్సులో నుంచి వచ్చిన ప్రవాహమే.

దేవతాశక్తులకు శరీరాలలో ఆశ్రయం ఇవ్వదల్చుకున్న బ్రహ్మ దేవుడు వాటికి ఆవు, గుర్రం శరీరాలను చూపించగా అవి విముఖత చూపిస్తాయి. మానవశరీరాన్ని చూపించినప్పుడు, ఆ శరీరం బావుంది అంటూ దేవతాశక్తులు మానవశరీరంలో ప్రవేశిస్తాయి.

① కుక్క - విశ్వాసము, కాలమునకు ప్రతీక.
② గుఱ్ఱము - ప్రాణశక్తి (అన్నమునుంచి ఆవిర్భవించిన శక్తి) కి ప్రతీక.

③ ఎద్దు - కష్టపడి పనిచేయటానికి ప్రతీక.

④ గొఱ్ఱె - మందను అనుసరించటానికి ప్రతీక.

❋ పై ఉదాహరణలను బట్టి ప్రకృతిలోని ప్రతీ పదార్థము (పద్మేస్థితాం) - భగవంతుని యొక్క నీచ మనస్సు ఫలితమే (కాంక్రీట్ మైండ్).

మనిషి యొక్క మనస్సు కూడా భగవంతుని వలెనే సృజనాత్మక శక్తి కలిగినది అన్నదానికి ఉదాహరణ ప్రకృతిలో భాగం కాకుండా నేడు మనిషి సాధించిన ప్రగతి (విశ్వామిత్ర సృష్టి).

❋ విశ్వామిత్ర సృష్టి అంటే ప్రపంచానికి పనికిరానిది.
నాశనానికి హేతువు అయ్యే సృష్టిని మానవసమాజం తిరస్కరిస్తుంది.

ఆటమిక్ ఎనర్జీ దురుపయోగం మీద ఆంక్షలు విధిస్తూ, వాతావరణ కాలుష్యానికి కారణాలైన వనరులు వద్దనుకొంటున్నాంకదా! ఇటువంటి సృష్టిని విశ్వామిత్ర సృష్టి అంటారు.

విశ్వామిత్రుడు అందువల్లనే రామ చేతనత్వం ఆవిర్భవిస్తేనే తప్ప తాను రాక్షసుల నాశనం చెయ్యలేను అని గుర్తించాడు.

ఋషులందరూ దీనిని తెలిసినవారే కనుక రామాయణంలో, మహాభారతంలో ప్రేరణనిచ్చే వ్యక్తులుగా కనిపిస్తారు.

భారతంలో వ్యాసుడు, రామాయణంలో అగస్త్యుడు.

దీనిని బట్టి వాళ్ళు యుద్ధంలో పాల్గొనలేదు అనుకోకూడదు. వారు ఎంత అహంకార రహితస్థితిలో ఉంటూ, మనస్సు యొక్క నిజస్వరూపాన్ని గుర్తించారంటే, ప్రతీది కాలప్రవాహానికి అనుగుణ్యంగా జరుగుతుంది కనుక వారికి యుద్ధం చేయాలనే భావన ఉండదు.

అయినా ఋషులు బాగానే యుద్ధం చేసి ఉండివుంటారు.



✧ ప్రకృతిలో భగవంతుని దివ్యశ్రవణానికి ప్రతీక టెలిఫోన్, మొబైల్ ఫోన్ మొదలైనవి.
దివ్యదృష్టి+శ్రవణానికి ప్రతీక టి.వి.
సర్వత్రా వ్యాపించి యున్న జ్ఞానానికి ప్రతీక వెబ్‌సైట్.

❋ అనగా భగవంతుని యొక్క ఊర్ధ్వ మనస్సులో ఉన్న ఆలోచన్ల పరంపరలను (కామం), కోరికలను మనిషి నీచమనస్సులో ప్రకటీకరించి తాను చేశాడు అనుకుంటాడు.

❋ ఈ సంపూర్ణ నామరూపమైన జగత్ అంతా భగవంతుని నీచ మనస్సు అని అర్థం చేసుకోవాలి. దానినే 'సరూపా మనస్సు' అంటారు.

ఆకూతిం - అనగా కుతూహలం (క్యూరియాసిటీ). అది కూడా భగవంతుని మనో లక్షణమే (డివైన్ మైండ్).

కుతూహలమే - వైజ్ఞానికులకు ఆధారముకదా!

❋ అందువల్ల ధ్యానస్థితిలో మనకి అవగాహన అవ్వవలసినది ఏమిటంటే, ఈ కోరికల కుతూహలము ప్రకృతి సహజము.

వాచః సత్యమశీమహి - ఈ కోరికల, కుతూహలముల ప్రవాహము, పరంపరలో 'వాక్' రూపమున తెల్పుకున్న విషయములే మనిషికి అనుభూతిలోకి వస్తాయి. వాటి సత్తా ఉనికి తెలుస్తుంది.
ఆ ఉనికిని కలిగిన వాక్‌ను ఉపయోగించుకొనుటయే సత్యము.

"ఋషీణాం పునరాద్యానం వాచమర్థానుధావతి"
ఋషులు పలికిన ప్రతీ (వాక్) మాట సత్యమే.

❋ వాక్ శక్తిని ఉపయోగించి చేయలేనిది అనేది ఏదీ లేదు.
అది అసంభవాన్ని సంభవం చేస్తుంది.

పతంజలి యోగసూత్రాలలో,

"జాత్యంతర పరిణామః ప్రకృత్యా పూరాత్"

పూర్వ దేహములు పోయి నూతనాణువుల ప్రకాశముచే నూతన దివ్యదేహములేర్పడుచున్నవి. ఇదియే ప్రకృత్యా పూరముచే గలుగు జాత్యంతర పరిణామము. (ప.యో.సూ. కైవల్యపాదం - సూ. 2)

ఈ సూత్రము వాక్ యొక్క సత్యత్వము లేక ఉనికిని తెలుపుతుంది. ఒక వ్యక్తి నిజంగా దారిలో ఒక చెట్టు క్రింద 5 బంగారు నాణాలు ఉన్నాయి, తీసుకోండని చెప్పాడు. ఇంకొకడు ఇదే మాటను అబద్ధంగా చెప్పాడు. మీరు గమనించవలసిన విషయం ఇక్కడ నిజం చెప్పిన వాడు కూడా అ మాటలే వాడాడు.

❃ అంచేత మాటలు అసత్యాలు కాదు.
చెప్పినవాడి ఆలోచనా విధానం అసత్యము.

అడుక్కునే వాడు ఈ ఇల్లు నీకు వ్రాసిస్తాను అంటే నవ్వుతాము. కాని ఒక రాజు ఈ ఊరిని నీకు ఇస్తానంటే నమ్ముతాము.

శ్రీ చేతనత్వంలో తేడా ఇది.

❃ ఈ సంపూర్ణ సృష్టి నాదే అనే చేతనత్వం కలవాడు ఎవరికైనా ఏదైనా ఇవ్వగలడు.

-- సాధన అంతా ఆ స్థితిని తెచ్చుకోవడానికే.

-- మట్టిని చేతిలో పట్టుకుని అది వజ్రమనే వాక్ - మట్టిని వజ్రంగా మారుస్తుంది (విశుద్ధానంద).

అశీమహి - రూపొందించుకొని అనుభవించెదమని అర్థము.

❃ పై వివరణ బట్టి బుద్ధిని ఉపయోగించుకొని మనస్సులో ఆవిర్భవించే మనసః కామమాకూతిం లకు (కుతూహలంతో కూడిన కోరికలకు - దీనినే గురుదేవులు వైజ్ఞానికి ఆధ్యాత్మికత అన్నారు) సవ్యమైన వాక్‌ను కూర్చగల్గితే భౌతికజగత్తులో అది సత్యము (ఉనికి)గా రూపొందుతుంది.



శ్రీ మంత్రవిద్యకు ఆధారము ఇదే.

పశూనాగ్ం రూపమన్నస్య - భగవంతుని యొక్క ఊర్ధ్వ మనస్సులో ప్రవహించే అనేక కోరికలు అన్నము వల్ల రూపు దాలుస్తాయి.

జీవో జీవస్య జీవనం

పాదహీనములగు తృణాదులను పాదములుగల పశువులు మేయుచున్నవి. చిన్న చిన్న జీవులను పెద్ద జీవులారగించుచున్నవి. ఒక జీవి మరొక జీవికి జీవికయగుచున్నది. (శ్రీమద్భాగవతం 13-46)

ఆ అన్నము అనగా ఖనిజ జగత్తు (సాశనా అసనే అభి) వృక్ష, జంతువులుగా రూపొందే ప్రక్రియ 3 స్థితుల్లో మనం పట్టుకుంటాం.

✧ రోగానికి మందు - అల్లోపతి.

-- రోగికి మందు - హోమియోపతి.

-- ప్రకృతి నియమానుసారం ఎలావుండాలో అలా ఉండేటట్లు చేసేది - ఆయుర్వేదం.

సృష్టిలో కనిపించే ప్రతీ చేతనత్వం గల రూపమూ (పశువు), అన్నము వల్లనే ఆ రూపమును దాల్చుకుంటున్నదికదా!

ప్రకృతి యొక్క ఈ అష్టైశ్వర్యాలు - ఈ 'శ్రీ' - మయి శ్రీశ్శ్రయతాం యశః - కీర్తి స్వరూపముగా నాలో మారునుగాక! అనగా సంపూర్ణ సృష్టికి ఉపయోగపడెదనుగాక!





కర్దమేన ప్రజాభూతా
మయి సమ్భవ కర్దమ
శ్రియం వాసయ మే కులే
మాతరమ్ పద్మ మాలినీమ్

కర్దమేన = కర్దముని చేత, ప్రజాభూతా = సంతతిగ పొందబడినది అగు, శ్రియం = శ్రీదేవిని, మాతరం = మాతృస్వరూపిణిని, పద్మమాలినీ = పద్మ మాల ధరించిన దానిని, మే కులే = నా వంశమునందు, వాసయ = వసింపజే యుము, కర్దమ = ఓ కర్దముడా ! మయి = నా యందు, సంభవ = నీవును ఉద్భవింపుము.

కర్దముడను ప్రజాపతి చేత సంతతిగ పొందబడిన సువర్ణ కర్దమ స్వరూపిణిని నాయందు కర్దమ స్వరూపిణివై యుద్భవింపుము. ఓ కర్దమ ప్రజాపతీ! మాతృ స్వరూపిణియు. పద్మాలంకృతయునగు శ్రీదేవిని మా వంశము నందు వసింపజేయుము.



శ్రియం వాసయ మే కులే - నా కులంలో "శ్రీ" నివసించాలనే భగవంతుని యొక్క ఊర్ధ్వమనస్సు యొక్క ప్రతిబింబమే, నేటి కుల వ్యవస్థ. కుల పోరాటాలు.

- అందుకే నేచర్ ఈజ్ ఆల్వేస్ రైట్ అనేది.

దీన్ని గమనించి 'వాచః సత్యమశీమహి' అనే శ్రీసూక్త నిర్దేశాన్ని ఉప యోగించుకోగలిగితే (గురుసత్తా వాక్‌లన్నీ దీనిని ఉద్దేశించే ఉచ్చరించబడి నవి) అప్పుడు '**భూమిపై స్వర్గావతరణ**' అనేది సత్యమై తీరుతుంది.

బ్రాహ్మణోస్య ముఖమాసీత్
బాహూరాజన్యః కృతః
ఊరూతదస్య యద్వైశ్యః
పద్భ్యాగం శూద్రో అజాయత

ఈ యజ్ఞ స్వరూపుడగు పురుషునకు బ్రాహ్మణుడు ముఖముగా నుండెను. క్షత్రియుడు బాహువులుగా జేయబడెను. వైశ్యుడు తొడలాయెను. పాదముల నుండె శూద్రుడు పుట్టెను. (పు.సూ. - 13 శ్లో.)

దైవీ చేతనత్వములో కుల వ్యవస్థ ఎలా పరస్పరం సహకరించు కోవాలో ఈ శ్లోకము తెలుపుతుంది.

- ముఖము అన్నాన్ని స్వీకరిస్తుంది. (ముఖము అనగా నోరు). ఈ సంపూర్ణ (బ్రహ్మాండం) సృష్టిలో వ్యాపించియున్న ప్రతీ పదార్థము అన్నమే. ఈ చేతనత్వమే బ్రాహ్మణత్వము.
- "పశూనాగ్ం రూపమన్నస్య" ప్రకారం - ఆ అన్నాన్ని నోటి వరకూ తీసుకురావటానికి చేతులు కావాలి (క్షత్రియులు).
- పనికిరాని మన దగ్గరున్న వస్తువును, ఇంకొకళ్ళ దగ్గరున్న పనికిరాని వస్తువును ఇద్దరికి అవసరమైన రీతిలో వినిమయం చేసుకొని ఇద్దరికీ ఆహారం పొందగల్గేటట్లు చేయుట వైశ్యవృత్తి.

-- సహస్రారం నుంచి ఇడ, పింగళ పరస్పరం కట్ చేసుకొని మూలాధారం వద్ద మళ్ళీ రెండుగా విభజింపబడి 2 పాదాలుగా జరిగే మార్పు తొడల వద్ద జరుగుతుంది.

తల్లి ఒడి అందుకు ప్రాధాన్యత కలిగి ఉన్నది.

-- పద్మమాలినీమ్ - దాని వల్ల నిర్ధారించుకున్న లక్ష్యము వైపు వెళ్ళగలిగే శక్తి వస్తుంది (పాదాలు).

❋ ఈ నాలుగింటిలో ఏది లేకపోయినా మనిషి యొక్క శరీర వ్యవస్థ దెబ్బతింటుంది, లోటువుంటుంది. అసంపూర్ణంగా ఉంటుంది.

మన శరీరంలో సెల్స్‌లాగే పశువులన్నీ, మనిషితో సహా ఆ విరాట్ పురుషుని రక్తప్రవాహంలో భాగమే (ఫలములే).

నేను కాలి యొక్క గోరునా, చేతి యొక్క గోరునా అనే ఉచ్చ, నీచాల ప్రసక్తి ఎలాగైతే శరీరంలో రాదో, అదే విధంగా "శ్రియం వాసయ మే కులే" - ప్రకృతి యొక్క సంపద మానవులందరి ద్వారా స్వర్గావతరణకు తోడ్పడాలి.

అనగా రచయితలనే కులానికి చెందిన బ్రాహ్మణులు, రాజనీతి కులానికి చెందిన క్షత్రియులు, వ్యాపారవేత్తల కులానికి చెందిన వైశ్యప్రవృత్తి, వైజ్ఞానికుల శూద్రప్రవృత్తితో కల్సి (యూజింగ్, ఎనాలసిస్ మొదలగు పనులు) అభినేతల యొక్క ప్రవృత్తితో కలసి, శరీరములోని వ్యవస్థలలాగే ఏ కులము, ఏ వ్యవస్థ యొక్క పనిని చేయాలో అర్థం చేసుకొని దానిని పరిపూర్ణంగా చేసి సమాజంలోని ఇతర వ్యవస్థలకు అందచెయ్యాలి.

ఉదాహరణకు, నోటి ద్వారా తీసుకున్న ఆహారం కడుపులోకి వెళ్ళి అక్కడ్నుంచి ప్రేగుల్లోకి వెళ్ళి, అక్కడ్నుంచి రక్తంగా మారి హృదయంలోకి వెళ్ళి సంపూర్ణ శరీరానికి శక్తినిస్తూ మాలిన్యాలను బయటకు తోసి వేస్తాయి. ఇందులో ఏ వ్యవస్థ ముఖ్యము?



ఆహారాన్ని తీసుకొనే నోటిని, పళ్లని అతి జాగ్రత్తగా చూసుకొని (బ్రాహ్మణులు) మల విసర్జన తంత్రము సవ్యంగా లేకపోతే ముందుగా నోటి దుర్వాసన వస్తుంది.

అందువల్ల ప్రకృతి యొక్క 'శ్రీ' - ఎవరి కులములో వారికి దానికి తగిన సంపదనివ్వాలి. శ్రియం వాసయ మే కులే అనే దానికి భావన ఇది.

కూతరమ్ పద్మ మాలినీమ్ - ఈ సమస్త సృష్టి అఖండ గురు చేతనత్వము నుంచి ఆవిర్భవిస్తుంది. ముఖ్యంగా మూలాధార పద్మము మరియు స్వాధిష్ఠాన పద్మములు కలసి ఏర్పడిన కర్దమము (బురద) సూర్య కిరణములతో కలసి 'పద్మ మాలినీమ్' అవుతాయి.

-- అనగా విశుద్ధి - మూలాధారమునకు ప్రతిగా, అనాహతము - స్వాధిష్ఠానానికి ప్రతిగా, ఊర్ధ్వ మనస్సు - నీచ మనస్సుకు ప్రతిగా కర్దమేన ప్రజాభూతా అవుతాయి.

అనగా వాక్‌శక్తి, శ్వాసతో కలసి సూక్ష్మ బురదగా మా... మానసికస్థితిలో ఉంటే, పృథ్వీతత్త్వం, జలతత్త్వం కలసి నీచ బురదగా మారతాయి.

ఈ ఊర్ధ్వ బురద - నీచ బురద సరైన వైబ్రేషనరీ హార్మోనిలో ఉంటే, మయి సమ్భవ కర్దమ - ఓ కర్దముడా! నాయందు ఉద్భవింపమని అనగలుగుతాము.

ఈ ప్రక్రియే సృష్ట్యాదిలో బ్రహ్మ ఊర్ధ్వలోకాల నుండి ఊర్ధ్వ బురద తెచ్చుకొని సృష్టి అనే సాంకేతిక విద్యను కల్పాంతము వరకు చేస్తాడు.

ప్రాణాయామము ద్వారా మంత్రవిద్యను కలిపి సృష్టించే విద్యే వేదవిజ్ఞానము - స్వరయోగము. భౌతికసృష్టి మొత్తము నాభి నుంచి ఉద్భవిస్తుందనే విషయం మరువవద్దు.





ఆప స్సృజంతు స్నిగ్ధాని
చిక్లీత వస మే గృహే ।
నిచ దేవీం మాతరగ్ం
శ్రియం వాసయ మే కులే ॥

స్నిగ్ధాని = మెరుపుకాంతులు కలిగిన, ఆపః = జలములు, సృజంతు = సృష్టించు గాక, చిక్లీత = ఓ చిక్లీతుడా, మే గృహే = నా గృహమున, వస = వసియింపుము, మాతరమ్ = తల్లియగు, శ్రియం దేవీం = శ్రీదేవిని, మే కులే = నా వంశమునందు, నివాసయ చ = నివసించునట్లు చేయుము.

ఓ చిక్లీతుడా! సరసములైన జలములు సృష్టించు గాక! నీవు నా గృహమున వసింపుము. మాతయైన శ్రీదేవిని నా వంశమున నిశ్చలముగ వసింపజేయుము.



ఆప స్సృజంతు స్నిగ్ధాని - జలములు (ఆపః) మెరుపు కాంతులు గల్గిన (స్నిగ్ధాని) - మేఘ జలములు సృష్టించుగాక!

నామ రూపాలుగా అన్నమయ జగత్ ఏర్పడటానికి విశేష సంరచన గల జలము ఉండాలి. తల్లి గర్భంలో ఉన్న నీరు మానవ శిశువుకు కావల్సిన మెరుపులు గల్గి వుంటాయి. వర్షపు జలములతో తడిసిన భూమి ఆ విత్తనానికి తగిన మెరుపులు కల్గివుంటుంది. భూమిని బట్టి విత్తనాలు ఎదుగుతాయి. భూమి మారితే కర్దముడు మారి (బురద) కావల్సిన మెరుపులుగల జలము లభించదు.

చిక్లీత వస మే గృహే - శ్రీదేవి, లక్ష్మీదేవి యొక్క పుత్రులు ముగ్గురు ప్రజాపతులుగా పనిచేస్తారు. వారు కర్దముడు, చిక్లీతుడు, ఆనందుడు.

క్లేదనము అనగా కలపటము. జలమునకు మెరుపుల నాపాదించి (లక్ష్మిని ఆపాదించి) ఆ విధంగా తడుపునట్టి శక్తి నిచ్చే దేవతయే చిక్లీతుడు.

- అనగా కర్దముడు బ్యాక్ గ్రౌండ్ తయారుచేస్తే,
- చిక్లీతుడు ఆ బ్యాక్‌గ్రౌండ్ నుంచి కావల్సిన మెరుపులకు అంకురార్పణ చేస్తాడు. అంకురార్పణ జరిగిన తర్వాత,
- యౌవ్వనస్థితికి వచ్చిన తర్వాత ఫలములను ఇచ్చే స్థితి ఆనందుడు.

అంటే తలపెట్టిన ఫలితము పొందాము. ఆ ఫలమే మళ్ళీ అనేక అలాంటి ఆలోచనలకు బీజమౌతుంది. ఉదా: టెలిఫోన్ ఆవిర్భవించటానికి కావల్సిన పరిస్థితుల్ని ప్రకృతి ఏర్పరచుకుంది. కర్దమస్థితి = కర్దముడు.

మార్కోని, జగదీస్ చంద్రబోస్ చిక్లీతుడి వల్ల ప్రేరణ పొందారు. ఆనందము అనే కోరిక వలన అనేక టెలిఫోన్ ఫలములు ఆవిర్భవించాయి.

అందువల్ల ప్రతీ నిర్మాణాత్మక కార్యక్రమాల్లో ఆఖరికి ఒక దోమ నుంచి ఈ సృష్టి మొత్తానికి ఇదే నియమావళి వర్తిస్తుంది. యాజ్ ఎబౌ సో బిలో.



ఆర్ద్రాం పుష్కరిణీం పుష్టిమ్
పింగళాం పద్మ మాలినీమ్ ।
చన్ద్రాం హిరణ్మయీం లక్ష్మీమ్
జాతవేదో మమావహ ॥

ఆర్ద్రయను పదము, హిరణ్మయి అను పదము పూర్వము సవిశేషముగా వివరింపబడినవి. పుష్కరిణీం = పోషణను కలిగించునది, తెల్ల కలువల మాల ధరించినది, పుష్టిం = పోషణ స్వరూపిణిని, పింగళాం = పింగళ వర్ణము (తేనెరంగు) కలది, పద్మ మాలినీమ్ = పద్మముల మాలను ధరించిన దానిని, చంద్రాం = చంద్రుని స్వరూపమైన చల్లని వెలుగులు గల దానిని, హిరణ్మయీం = బంగరు రంగున వెలుగొందు దానిని, కిరణమయ స్వరూపిణిని, లక్ష్మీం = శుభ లక్షణములు గల దానిని, మే + ఆవహ = నాయందు ఆవాహన చేయుము.

ఓ జాతవేదుడా! ఆర్ద్ర స్వరూపిణియు, కలువ పువ్వుల, తమ్మి పువ్వుల దండ ధరించినదియు, పోషణము, పుష్టి కలిగించునదియు, పింగళ వర్ణము గలదియు, హిరణ్మయ మూర్తియు, చంద్రుని స్వరూపము గలదియు అగు లక్ష్మిని నాయందావహింప జేయుము.



ఇది శ్వాస ద్వారా చంద్రనాడిని ఉపయోగించుకునే విద్య.

పుష్కరిణీం - పోషణ కలిగించేది.

లోపలికి వెళ్తున్నటువంటి శ్వాస 12 ఎముకలు గల rib cage లో 5 భాగములు గల ఊపిరితిత్తులలో ఆక్సిజన్ ద్వారా సంపూర్ణ శరీరానికి పోషణని ఎలా ఇస్తోందీ గమనిస్తే, లోపలికి వెళ్తున్నటువంటి శ్వాసకు వాక్‌ను కలిపి కుంభించినప్పుడు ఆ వాక్‌కి పుష్టి గల్గి బీజరూపం దాలుస్తుంది.

❋ అంటే, కర్దముడు చిక్లీతుడిగా లంగ్స్‌లో పరివర్తన చెందాడు.

పుష్టిమ్ - పోషణ స్వరూపిణి.

కుంభించిన వాయువు మంత్ర వర్ణములతో కలసి హృదయం ద్వారా రక్తవాహక నాళికలలో కలసి systole - diastole (లబ్ - డబ్ స్పందన) ద్వారా శరీరములో వున్న కణముల నుంచి శక్తిని గ్రహించి మళ్ళీ హృదయానికి చేరుతుంది. అక్కడ ఆనందుడు పనిచేస్తాడు.

❋ శరీరము అనే రాష్ట్రంలో ఈ ఆనందుడు పనిచేయకపోవటం వల్ల ఈనాడు హృద్రోగాలు ఎక్కువయ్యాయి.

పింగళాం - తేనె వర్ణము లేక పింగళ వర్ణము కల్గినది.

పద్మమాలినీమ్ - షట్చక్రాల్లో ఉన్నటువంటి మంత్రాత్మకమైనటువంటి బీజ స్వరూపమునే పొందుతూ,

చన్ద్రాం - హృదయం సూర్యుడు కనుక, సూర్యుణ్ణించి రిఫ్లెక్ట్ అవుతున్నటువంటి కాంతి, అనగా హృదయం నుంచి శరీరంలో ప్రవహిస్తున్న రక్తము చంద్రాం, చల్లని వెలుగులు గల దానిని,

లక్ష్మీమ్ - కావల్సిన లక్షణములు గల బీజముగా,

జాతవేదో మమావహ - నన్ను ఆవహింపుము.



ఆర్ద్రాం యః కరిణీం యష్టిం
సువర్ణాం హేమమాలినీమ్ ।
సూర్యాం హిరణ్మయీం
లక్ష్మీం జాతవేదో మమావహ ॥

కరిణి = ఏనుగులు కలది, యష్టి = యజ్ఞదండము యొక్క స్వరూప మైనది, సువర్ణ = బంగారు రంగు కలది లేక మంచి వర్ణములచే వ్యక్తమగునది, హేమమాలిని = బంగారు హారములు గలది, సూర్య = సూర్యుని వెలుగు తన స్వరూపముగా కలది. (మిగిలిన పదముల కర్థము పూర్వము వ్యాఖ్యానింపబడినది.)

ఓ జాతవేదుడా! ఆర్ద్ర స్వరూపిణియు, ఏనుగుల వైభవములు గల దియు, యజ్ఞ దండము స్వరూపమైనదియు, సువర్ణ కాంతులు కలిగినదియు, హేమమాలికలు ధరించునదియు, సూర్య కిరణముల సాక్షాత్కరించునదియు, హిరణ్మయ మూర్తియు నగు లక్ష్మిని నా యందు ఆవాహనము చేయుము.



ఇది పింగళ శ్వాస (కుడిశ్వాస) ను ఉపయోగించుకునే విధానము.

కరిణీం - ఏనుగులు కలది, మణిపూరక చక్రం వద్ద.

హస్తినాద ప్రబోధినీం - ప్రకృతిలో ఇది హస్తానక్షత్రం నాడు, వినాయకచవితి నాడు జరుగుతుంది.

యష్టిం - యజ్ఞదండము యొక్క స్వరూపము - మేరుదండము.

యజ్ఞము అనగా పదార్థములను సంస్కరించేది.

❋ మేరుదండము కూడా ప్రపంచానుభూతుల్ని సంస్కరించాలి. ఉదా: ముక్కు - వాసనలను, నాలుక - రుచులను సంస్కరించాలి.

సువర్ణాం - మంచి అక్షరముల సముదాయము.

భౌతికంగా endocrin"e system, glands పరిశుభ్రమవ్వాలి. సూక్ష్మజగత్తులో ముందు మూలాధార చక్రం నుండి ఆజ్ఞాచక్రం వరకు దళాలు శుభ్రమై తద్వారా సహస్రార దళాలు వికసించాలి. పరిశుభ్రమవ్వాలి.

హేమమాలినీమ్ - బంగారు హారము గలది.

పైన బంగారు చేతనత్వం వివరింపబడినది.

సూర్యాం - స్వయం ప్రకాశమగు స్థితిలో కనుక శ్వాస బహిర్గతమైతే, అది 7 వర్ణములుగా ప్రకృతిలో తన అస్థిత్వాన్ని ఏర్పరచుకొంటుంది.

తల్లి నుంచి వేరైన బిడ్డ ప్రకృతిలో అదే విధంగా వెలుగొందుతుంది. (తల్లి మొదట తన నెత్తురునిచ్చి పోషిస్తుంది-చంద్రాం. బిడ్డ బయట కొచ్చిన తర్వాత తల్లి ఇచ్చిన స్వయం పోషకశక్తి వల్లే ఎదుగుతాడు - సూర్యాం)

హిరణ్మయీం - సూర్యుని వెలుగు తన స్వరూపముగా గలది.

సూర్యకిరణ విజ్ఞానమును ఉపయోగించుట.





తాం మ ఆవహ జాతవేదో
లక్ష్మీ మనపగామినీమ్ ।
యస్యాం హిరణ్యం ప్రభూతమ్
గావోదాస్యోశ్వాన్ విన్దేయం పురుషానహమ్

జాతవేదాః = ఓ జాతవేదుడా ! యస్యాం = ఎవతెయందు, హిరణ్యం = బంగారమును, గావః = గోవులను, దాస్యః = దాసీ జనమును, అశ్వాన్ = అశ్వములను, పురుషాన్ = పురుషులను, అహం = నేను, విన్దేయం = పొందగలనో, తామ్ = ఆమెను, అనపగామినీమ్ = లక్షణములు గలదానిని, లక్ష్మిం = శుభలక్షణ దేవతను, ఆవహ = ఆవహింపజేయుము.

ఓ జాతవేదుడా! ఎన్నడు నెడబాయని లక్షణములు గల లక్ష్మిని నా యందు ఆవహింపజేయుము. ఆమె యందు కొల్లలుగా హిరణ్యమును, గోవులను, అశ్వములను, పురుషులను దాసదాసీ జనమును నేను పొందుదును గాక!



తాం మ ఆవహ జాతవేదో లక్ష్మీ మనపగామినీమ్ - పైన చెప్పిన వివరణ.

యస్యాం హిరణ్యం ప్రభూతమ్ - ఋషి నుంచి బయటకొచ్చిన నిశ్వాస, ముందు హిరణ్యం, బంగారు రంగు కలిగివుంటుంది. ఆ ఉచ్ఛ మానస తరంగాలను,

గావో - సూర్యుని యొక్క తెల్లని కిరణము, అనగా 7 రంగుల సమన్వయ మును, (ఆనందకోశ జాగరణ లేక ఆనందుని ఫల ప్రభావము),

దాస్యో - ఇంద్రియాలను పరిపూర్ణంగా ఉపయోగించుట లేక యోగవిద్యను;

అశ్వాన్ - అశ్వములను లేక ప్రాణమయ శరీరమును

విన్దేయం - పొందగలము.

అనగా ఋషి తన వాక్‌లతో చైతన్యవంతమైన భౌతిక సృష్టిని నిరంతరం మార్చగల్గే శక్తి పొందాడు. దీని వల్ల సర్వజీవ మైత్రి కలుగును.

పురుషానహమ్ - చేతనత్వ విద్య లేక Technology of Consciousness నేను పొందుదును గాక!

